# దేవులపల్లి రామానుజ రావు — ఒక రేఖాచిత్రం




టి. శ్రీరంగస్వామి

# దేవులపల్లి రామానుజరావు—రేఖా చిత్రం

## టి. శ్రీరంగస్వామి



సాహితీ మిత్రమండలి
పరకాల
వరంగల్లు – 506 164
1991

*A life line of Devulapalli Ramanuja Rao,*

*Sketched by T. Sri Ranga Swamy*



Publication No. 2

Price : Rs. 10/-

[illegible]

For Copies :

VISHALANDHRA BOOK HOUSE
Hyderabad, Hanamakonda, Tirupati
Vijayawada, Vizag, Ananthapoor. Kakinada

SAHITHI MITRAMANDALI
PARKALA, Warangal-506 164

ఆంధ్ర సారస్వత పరిషత్తు
బొగ్గులకుంట, హైదరాబాదు-500 001

NATARAJ PRINTERS,
Kashibugga, Warangal.

# ముందుగా ఒక మాట...

సాహితీ మిత్ర మండలి పర్కాల మలి ప్రయత్నమిది. ఒక సాహితీ వైతాళికుని గూర్చి, వర్తమాన సాహితీ పిపాసకులు ఆత్మీయ భావంతో అర్పించుకునే నీరాజనమిది.

శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు ఎందరో సాహితీమూర్తులకు, సంస్థలకు ఆరాధ్యుడు. వర్తమానంలో శ్రీ శ్రీరంగస్వామిగారు కూడ ఆ బాటలో సాగుటకుద్యమిస్తున్న కార్యశీలి, ఆకారంలో చిన్నగా ఉన్నా, అందరి కన్నా మిన్నయైన వారొకరు, వారి జీవితాన్ని విశ్లేషిస్తున్న వారొకరు.

ఈ మా మలి ప్రయత్నంలో మేముకోరగానే శ్రీ దేవులపల్లిగారి ఈ పరిచయాన్ని ప్రచురింపజేయుట కంగీకరించిన మా సాహితీ నివేదనానికి తోడ్పడిన, మా ఆప్తులు, సాహితీ పిపాసకులు శ్రీ శ్రీరంగస్వామి గారికి కృతజ్ఞతలు.

మేము కోరగానే ముందు మాటగా తమ అభిప్రాయాన్ని వెలువరించిన కళాప్రపూర్ణ శ్రీ పారుపూరు కోదండ రామరెడ్డి గారికి కైమోడ్పులు. ఈ పుస్తకప్రచురణలో తోడ్పడిన మా సంస్థ సాహితీ మిత్రులందరికీ ధన్యవాదములు మాకు ముమ్ముందు మీ అందరి సహకారం ఉంటుందని ఆకాంక్షిస్తూ.

పల్లేరు వీరస్వామి
కన్వీనర్,
సాహితీ మిత్ర మండలి, పర్కాల

'కళాప్రపూర్ణ' నెల్లూరు

మరుపూరు కోదండ రామరెడ్డి

# ఒక నిండు మనిషిని గురించిన ముదింపు

మూర్తి ఎంత చిన్నదో, కీర్తి అంత పెద్దదై, పండు వెన్నెల గాయించిన బహుముఖ ప్రజ్ఞాశాలి, ఈ తెలంగాణా తెనుగు బిడ్డ—ఈ దేవులపల్లి వారు. ఈ వివిధ గుణ దీపితుని సమగ్ర చరిత్ర చిత్రీకరణమే సాహితీ మిత్ర మండలి వారి (టి. శ్రీరంగస్వామి) ఈ లఘులేఖనము.

ఇది తెలంగాణా సమిష్టి సమగ్ర చరిత్ర. తెలంగాణా రాజకీయ సాంఘిక సాంస్కృతిక సాహిత్య ఉద్యమాలలోను, ఆ తర్వాత సమగ్ర ఆంధ్రోద్యమాలలోను రామానుజరావుగారు పెనవేసుకొని పోయి ఉన్నారు. ఇందు ఈయన వట్టి ప్రేక్షకుడు గాదు, కార్యనిర్వాహకుడు. వీరు ఈ అన్నిరంగాలలో చేయితిరిగిన సవ్యసాచి, పాత్రికేయుడుగా, భావకుడైన కవిగా, ఉపన్యాసకుడుగా, సంస్థాపాలకుడుగా, విద్యాశాఖ నిర్వాహకుడుగా— తాను పాల్గొన్న ప్రతి పనిలో తమ సామర్థ్య కీర్తిని ప్రస్ఫుటంగా ముద్రించినారు. తమ కవితా సంకలనము 'పచ్చతోరణమును' గుణగౌరవం చేత పచ్చల తోరణంగా చేసినారు.

ఆంధ్ర సారస్వత పరిషత్తు వీరి నిర్మాణ శక్తికి శాశ్వత కీర్తి స్తంభము; ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ చరిత్ర వీరి కార్యనిర్వాహక శక్తి నివేదిక.

ఇన్నిట అరితేరినా తల తిరుగని వినయభూషణుడు. ప్రతివారిని— కులమత వివక్షత లేకుండా ఆదరించి ఆదరింపబడుతున్నారు. ఆత్మగౌరవము సంగతి ఎరిగినవాడు కాబట్టె ఎదిటివారి గౌరవమును మాన్యపరచగలుగుతున్నారు. ప్రతి వాని పట్ల చెలిమి చలువను ప్రసరింపజేసి హాయిని కూర్చగలుగుతున్నారు. ఈయన స్నేహము దినదిన ప్రవర్ధమానము. స్వయంగా, నా హైదరాబాద్ సాహిత్య వ్యాసంగంలో, ఈయన ఆస్థానము— ఆ పరిషత్తు నాకు చలువ పందిరి, నా సాహిత్య జీవితంలో ఇది సువర్ణఘట్టము.

'తెలంగాణా' కీర్తి నిజాముల కాలంలో కొంత మరుగైనా, తీరప్రాంతానికి ఎందునూ తీసిపోదు– పేరుబడ్డగడ్డ! కాకతీయుల పాలన ప్రజాశ్రేయో రాజ్యమైనది. కాకలు తీరిన కవులు– పోతన, సోమన, బద్దారపు, మల్లారెడ్డి వేములవాడ భీమన, సంస్కృత వ్యాఖ్యాతృ చక్రవర్తి మల్లినాథ, కన్నడ కవిత్రయం– పంప, దన్న (వైశ్య) తెలంగాణావారు. పొన్నడు వేంగి ఆంధ్రుడు.

ఆధునిక యుగంలో ప్రతిరంగములో 'నాయకమణులకు' కొదువలేదు. ఈ నేపథ్యం రామానుజరావుగారికి అనువుగా నిలిచి ఉన్నది.
ఇక ప్రస్తుతం శ్రీరంగస్వామిగారి లఘు లేఖనం :–

ఈ రచన చిన్నదైనా, దేవులపల్లి వారి జీవిత వివిధ విషయాలను రచనా నైపుణ్యం మెరసేటట్లు వ్రాసినారు. విషయాలు క్రిక్కిరిసి ఉన్నవి. ఇక ఆ బిగువులో కొత్తగా సూదిమొనగూడ దూరదు. రావుగారి నేర్పును వన్నెకు దెచ్చిన ఓర్పును కండ్లకు గట్టినట్లు విప్పి చెప్పినారు. ఆయన ప్రాగల్భ్యము కొంత సమగ్రంగానే వర్ణింపబడి యున్నది. ఇందలి విషయ గురుత్వమును పెంచను భాష దీపిస్తూ, రచయిత సౌజన్యాన్ని చాటుతున్నది. ఈ వ్రాత రావుగారిని ఒక నిండు మనిషిగా తీర్చిదిద్ది నిలబెట్టుతున్నది.

ప్రతిరంగంలో లెక్కకు ఎక్కిన ప్రతి వ్యక్తికి పరిచయం రావుగారి స్నేహశీలానికి ఒక తేజోరేఖ! ఇది శ్రీరంగస్వామి కృషికి ప్రతిబింబిస్తున్నది. రామానుజరావుగారి గూర్చి పరిశోధించే వారికి ఇది ఆకరము.

ఇక దేవులపల్లివారు. అన్నిటా కోరదగినది దైవ కటాక్షం తప్ప అన్యమేమీలేదు. పుత్ర పుత్రీ సౌభాగ్యంతో హాయిగా కీర్తితో మనుచున్నారు.

''అపర్ణ''
జేమ్సు గార్డెన్సు
నెల్లూరు - 3

"కళాప్రపూర్ణ"
మరుపూరు కోదండ రామరెడ్డి

*T. Sri Ranga Swamy*

16 th July 1950 at Parlapally, Kareemnagar Dist.
Address :
H. No. 5-11-114/4, Vidyaranyapuri, Warangal.

**Printed Books ;**

Madhura (Freeverse Poetry) 1984
ShiKharam (Freeverse Poetry) 1986
Manasa Sancharare ... (Freeverse Poetry) 1988
Vipanchi (Essays) 1986
Warangal Zilla Rachayithala Vangmaya Jeevitha Suchika 1987
Kovela Suprasannacharyulu Vangmaya Jeevitha Suchika 1991
A life line Sketch of Devulapalli Ramanuja Rao 1991

**Edited Books ;**

Chitanya (Collection of freeverse Poetry) 1983
N. B. Rao, Kavitha Darpanam (Essays) 1985
Diviti (Collection of freeverse Poetry) 1986
Prabhava (Collection of freevarse Poetry) 1987
Swaramalika (Collection of freevarae Poetry) 1987
Shukla (Collection of freeverse Poetry) 1989
Pramodoota (Collection of Free Poetry) 1990
Prajothpathi (Collection of freeverse Poetry) 1991
Ekashila Vythalikulu (Essays) 1991

**Unprinted Books ;**

Warangal Nataka Ranga Charitra
Katragadda Kavitha Samalochanam
Kozara to Ekashila (Telug Poetry - Translation to Yugoslavia Poetry)
Shataka Sahitya Vikasamu XXXXXXXXXXX **after 1960's**

# దేవులపల్లి రామానుజరావు

"ప్రియ మిత్ర కళాభిజ్ఞః సాహితీరసికం సుధీః
రామానుజో గుణాబోధః జయమేతు శతం సమాః

— డా॥ దివాకర్ల

ఈ వ్యాసాన్ని మీకు అందించే ముందు, శ్రీ దేవులపల్లి రామానుజ రావుగారు అభిమానించే అప్పుడు, భావ కవితా ఉద్యమానికి ఆద్యుడు అయిన శ్రీ రాయప్రోలు సుబ్బారావు గారి కమనీయ పద్యమును ఒక దానిని ఇక్కడ చెప్పి వారి గురుత్వభావనకు ప్రతీకగా ఉంటుందనీ, అది సమంజసం అని కూడా భావిస్తున్నాను.

''మామిడి కొమ్మ మీద కల మంత్ర
పరాయణుడైన కోకిల
స్వామికి మ్రొక్కి యీ యభినవ
ధ్వని ధారణకుద్యమించితిన్
ఈ వికసించిన శ్రావణ
నిశీధమున గానబడిన నాదరసుతకున్

ప్రశమితమతినై యీ ప
ద్య శుభాంజలి నొసంగితి ప్రణయార్ద్రమనంబున్
శాశ్వత నవ్య స్ఫురణల
నశ్వర లావణ్యమై యెనయు కావ్య కళా
విశ్వమునందానందర
సైశ్వర్యములేలు కవితకంజలి యిత్తున్."

శ్రీ రామానుజరావుగారిది బహుముఖ ప్రజ్ఞ. ఇంగ్లీషు, తెనుగు ఉరుదూలలో నిగ్గయిన పాండిత్యం, న్యాయవాద పట్టభద్రుడు, మంచి రచయిత, కవి కలుపుగోలుతనము సరసత ఈయన కార్య నిర్వహణ దక్షతకు పదను బెట్టినవి. ఈ కార్యాచరణ కౌశల్యం, ఆయన చేపట్టిన పనులకు, సంస్థలకు సుస్థిరతను గూర్చి, వాటి కీర్తిని పిండి ఆరబోసినట్లు పండు వెన్నెల గాయించినది. కాబట్టే తెలంగాణా సాంస్కృతిక సాహిత్య ఉద్యమాలలో రావుగారు ఒక ప్రముఖ పాత్ర అయినారు.

గోలకొండ పత్రికకు ఇరవై ఏండ్లు సంపాదకీయాలు వ్రాసినారు. చాలా ఏండ్లు ఉస్మానియా యూనివర్సిటీ సిండికేటు, సెనేటులలో పలుకుబడి గలిగిన సభ్యుడిగా పనిచేసినారు. మధ్య మధ్య వైస్ ఛాన్సలరుగా పనిచేసినారు. రాజ్య సభలో సభ్యుడిగా ఉండినారు. కొంత కాలం తెలంగాణా గ్రంథాలయ ఆంధ్రోద్యమాలలో చాలా లోతుగా దిగి పనిచేసినారు. జంటనగరాలలో ఒక ప్రతిష్ఠాపూర్ణ సంస్థ అయిన ఆంధ్ర సారస్వత పరిషత్తును నాటి, నీరుబోసి, పెంచి వివిధ శాఖలలో ఒక పెద్ద మర్రి చెట్టుగా చేసిన కార్యకర్తలలో వీరు తలమానిసి ఈ పని నేర్పరి ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ పుట్టినది మొదలు ప్రధానకార్యదర్శియై నేటి వరకు సమగ్ర ఆంధ్రావనిలో అభిమానానికి పాత్రులై దాని పేరు ప్రతిష్ఠలకు ఒక నిగుపును సమకూర్చినారు. కేంద్ర సాహిత్య అకాడిమీలో రెండు తడవలు పదేండ్లు కార్యనిర్వాహక సంఘం సభ్యుడిగా కార్యసరణిలో తన ముద్రను అద్దినారు. నగర గ్రంథాలయ సంస్థ అధ్యక్ష పదవి ఈయనను వరించడంలో వింతలేదు. ఆయన రాణింపచేసిన గౌరవ పదవులలో ఇవి కొన్ని మాత్రమే.

కుల మత వర్గ భిత్తికలు విభాగించని విశాల హృదయం శ్రీ రావు గారిది. మాడపాటి హనుమంతరావు, బూర్గుల రామకృష్ణారావు, సురవరం ప్రతాపరెడ్డి మొదలగు పెద్దల అభిమానం పొందినవారు. వనపర్తి రాజా రామేశ్వరరావు, నూకల నరోత్తమరెడ్డి, ఎం. రామప్ప (రిటైర్డు కలెక్టరు) బొమ్మకంటి సత్యనారాయణ, గడియారం రామకృష్ణ మొదలగు అప్తులకు నోటిలోని నాలుక ఈయన. ఇన్ని పదవులు పరిచయాలు చేకూర్చిన పలుకు బడిని, ఇతరుల సేవలకు సహాయాలకు వినిమయం చేసిన స్వార్థరహితుడు.

"మీజాన్" పత్రిక ద్వారా "ఏకశిలా నగర శిలాఫలక కలకల శోభా విభావరి" అన్న బిరుదాంకితుడూ. ఆంధ్ర సారస్వత పరిషత్తు వేరు, దేవులపల్లి రామానుజరావు పేరు కాకుండా రెండూ రామానుజరావుగారే అయి పరిషత్తు మే, 1943 సంవత్సరంలో స్థాపించిన నాటి నుండి నేటి వరకు సభ్యుడు, కార్య వర్గ సభ్యుడు పరీక్ష కార్యదర్శి, ఉపాధ్యక్షుడు, అధ్యక్షులుగా అనుబంధాన్ని అనురక్తిని పెంచుకుంటూ కొన్ని లక్షల మందికి (ఆంధ్ర సారస్వత పరిషత్తు ద్వారా పరీక్షలు నిర్వహించి) ఉపాధిని కలగించడమే అయన ధ్యేయం తను నమ్మిన సిద్ధాంతానికి నిరంతరం పోరాడుతూ దానిని సాధించుకోవడం అయన కర్తవ్యం 'పిట్ట కొంచెం—పట్టు ఘనం' 'పొట్టివాడు—గట్టివాడు' అన్న నానుడిలకు నిదర్శనంగా ఈ నాడు వటవృక్షంలా నిలిచిన ఆంధ్ర సారస్వత పరిషత్తు వారి నిస్వార్థ సేవకు ప్రతీక— అందుకు అయన ప్రతిబింబం. అంతేకాదు శ్రీ రామానుజరావు గారి జీవన ప్రతిబింబానికి ఓ మచ్చుతునక.

శ్రీ రామానుజరావుగారు 25 అగస్టు 1917లో వరంగల్లు పట్టణానికి 8 కిలోమీటర్ల దూరములో నున్న దేశాయిపేట గ్రామంలో వేంకటచలపతి రావు, ఆండాళమ్మల ప్రథమ సంతానంగా జన్మించారు. వంగపాడుకు దత్తతగా వచ్చాడు. వీరి నివాస స్థానము వరంగల్లులోని ఎల్లమ్మ బజారు. నాలుగవ ఫారం వరకు అయన విద్యాభ్యాసము ఇంటివద్దనే గడిచింది. నాలుగవ ఫారం చదువుకొనే నిమిత్తం అయన హన్మకొండలోని "కాలేజ్ ఎట్ హై స్కూల్"లో చేరారు. (ఇదే తర్వాత మల్టీపర్పస్ హైస్కూల్‌గాను, ప్రస్తుతం ప్రభుత్వ జూనియర్ కాలేజీగాను రూపాంతరం చెందింది.) అయన పాఠశాలలో చదువుకునేటప్పుడు అయన కొరకు పెద్ద గుర్రం టాంగా (జట్కా) ఒకటి ప్రత్యేకంగా మట్టెవాడ నుండి హనుమకొండకు వచ్చెడిదట. వీరు చిన్ననాటి

నుండే దయార్ద్రహృదయులు, మృదువుగా మెత్తగా మాట్లాడేవారు. (మాజేటి రామప్పగారు ఒకచోట అంటారు) వీరికి ఒక కుమారుడు, ఇద్దరు కుమార్తెలు. ఈనాటికీ అయనతో పరిచయం ఉన్నవారికి ఈ విషయం బోధకంగానే అగపడుతుంది. శ్రీ రామానుజరావుగారు కుదుమట్టమైన మనిషి, సన్నగా చామన చాయ కలిగి, మధ్యపాపట కలిగి, కళ్ళద్దాలతో ముఖం కళకళలాడుతూ ఉంటుంది ఆ హాసోన్ముఖునితో కొంచెం హాస్య ప్రియుత కూడా కలదు. ఆ సహృదయుడు నవ్వుతూనే మాట్లాడిస్తాడు. అయన మాటల్లో హృదయ సంస్కారం కనబడుతుంది. కావ్యభాషలో మాటాడుతాడు. ఆయన యువకులలోనే లెక్క ఆయన సాహిత్య వ్యవసాయం ఒక స్వర్ణోత్సవం, అంతేకాదు ఆయన ప్రాచీన కాలపు పండితుల శ్రేణిలో చేరని నవీన కాలపు పండితుడు. అంత మెత్తని వాడూకాదు, అంత గడుసరీ కాదు. మొత్తానికి మెత్తగా ఉన్నట్లు కనిపించిన స్వీయాభిప్రాయాలను వీడని ధీరచిత్తుడు. ఇంతైనా అయన కార్యవాదిగాని, ఋగ్గవాది మాత్రం కాదు. అయన వ్యవస్థాపకుడు, కార్యకర్త కూడా.

ఈయనను మనం పొట్టివాడుగా భావిస్తే మాత్రం, పొట్టివాడే అయినా తనకంటే చాలా పొడుగైన వారి ఎదుట నిటారుగా నిలబడే శక్తి ఈయనకుంది. నిలబడి ధైర్యంగా మాట్లాడగలడు అని అయన యాభై ఏళ్ళ జ్ఞాపకాలు పరికించినప్పుడు మనకు తెలుస్తుంది. నిలబడటం అంటే ఊరికే నిలబడటం కాదు. మనిషి పెరగగలడు ఎంత ఎత్తుకు కావాలంటే అంత ఎత్తుకు పెరగగలడు. ఈయన దగ్గర ఇంకో విచిత్రం ఉంది. ఎదుటనున్న వ్యక్తి ఎంత ఎత్తో అంత ఎత్తుకు మాత్రమే పెరిగి ఊరుకోడు. అయన ఇంటే పైకి ఎదిగి, అక్కడ నుండి క్రిందికి చూస్తాడు చిరునవ్వులు కురిపిస్తూ.

శ్రీ రామానుజరావుగారు మద్రాసు విశ్వవిద్యాలయము నుండి పట్టభద్రులైనారు. తరువాత నాగపూర్ విశ్వ విద్యాలయం నుండి ఎల్.ఎల్.బి. పట్టాను పొందినారు. నాగపూర్‌లో డా॥ నటరాజ రామకృష్ణ తదితరుల చేత పరిచయం కలిగింది. ఆ కాలములోనే తెలుగు సాహిత్యం మందు అభిలాష కలగడంతో వరంగల్లులో 'శోభ' పత్రికలు స్థాపించి నడిపించినారు. విద్యాభ్యాసం తర్వాత కొంత కాలం గ్రంథాలయోద్యమమునకు తన సేవలను అందించినారు. 1941 సంవత్సరంలో వరంగల్లు పట్టణములో శబ్దానుశాసన ఆంధ్ర భాషానిలయమునకు కార్యదర్శిగా ఉండి దాని రజతోత్సవమును జరిపిం

చినారు. 1942 ప్రాంతంలో తెలంగాణా పత్రికకు సాహిత్య వ్యాసములను పంపుతుండేవారు. 1945-46లలో వరంగల్లు యువజన కాంగ్రెసునకు అధ్యక్షులుగా ఎన్నుకొనబడినారు. వీరి అధ్వర్యములో నిర్వహిస్తున్న సాహిత్య పత్రికను రాజకీయ విషయాలకు ఉపయోగించుటకు నసేమిరా అంగీకరించలేదు.

గోలకొండ పత్రికలో ఉప సంపాదక పదవికి సురవరం ప్రతాపరెడ్డి గారు ఆహ్వానించినారు. ఆయన తన అభిప్రాయాలను నిర్భయంగా ఇందులో ప్రతిబింబింపచేస్తూ, కర్తవ్య నిర్వహణను సాగించినారు. 1949-50లందు హైద్రాబాద్ రాష్ట్ర కాంగ్రెస్ ఎలక్షన్ ట్రిబ్యునల్ సభ్యులుగా పనిచేసిరి. 1955లో అలంపూరు తాలూకా కాంగ్రెసు ఎన్నికలకు రిటర్నింగు ఆఫీసర్‌గా నియమితులైనారు. 1960-62 సం॥లలో సాహిత్య ప్రతినిధిగా రాజ్యసభ సభ్యులుగా పనిచేసినారు. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో 1950 నుండి 1979 వరకు సెనేటు సభ్యుడుగా, సిండికేటు మెంబరుగా, ఎగ్జిక్యూటివ్ కమిటీ మెంబరుగా, ఆక్టింగు వైస్ ఛాన్సలర్‌గా 3 సార్లు పదవులను నిర్వహించినారు ప్రస్తుతం ఆంధ్ర ప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయం (A.P. Open University) ఎగ్జిక్యూటివ్ కమిటీ సభ్యులుగా కూడా ఉండినారు. తెలుగు విశ్వవిద్యాలయం సిండికేటు సభ్యులుగా ఉన్నారు రెండు మూడు సంవత్సరాలు. కేంద్ర విశ్వవిద్యాలయం (హైదారాబాద్ సెంట్రల్ యూనివర్శిటీ) ఎగ్జిక్యూటివ్ కమిటీ సభ్యులుగా 1974-77ప్రాంతంలో పనిచేసినారు.

వీరి మొట్ట మొదటి గ్రంధం ఖండకావ్యం. అది ''పచ్చతోరణం'' శ్రీ రామానుజారావుగారి భావుకతకు అది ప్రతీక. 'సంక్రాంతి' ఆయన వర్ణించిన తీరు అమోఘం.

"కుంకుమంబులు చల్లి గొబ్బి ముద్దలు పెట్టి
    పగడాల సొగసును పరిహసింప
పక్షి వ్రాలిన భంగి పసుపు ముగ్గులు దీర్చ
    పుష్యరాగంబుల పొలుపుమీర
రంగారదీర్చిన రంగవల్లిక గుంపు
    కన్నెతీగలవోలె వన్నె గుల్క
జడలోని పూవులు జారి యుండినచోటు
    ముత్యాల ముగ్గుతో ముచ్చటాడ

చీరకుచ్చిళ్ళు పదపదముల చిందులాడ
తెమగువాకిండ్ల దిరిగెడు తీగబోండ్లు
సరస సల్లాపములు సేయు సమయమందు
పుట్టినింటికి వచ్చెను పుష్యలక్ష్మి"

ఆయన సంక్రాంతి లక్ష్మిని ప్రతిబింబించిన తీరు అది. ఆస్వాగతం లోనే లలితమాధుర్యమైన పదసంధానలను మనం పరవశంతో చదువుకొనవచ్చును.

వీరి పుస్తకాలలో చెప్పుకోదగినది, మణిపీఠం అలంకరించిన గ్రంథం "సారస్వత నవనీతము". వీరి ఉత్తమ సాహిత్య విమర్శకు ఆధారంగాను, వీరి తులనాత్మక శక్తిని, వీరిలోని విమర్శకుడ్ని ఆయనలోని నిశితమైన పరిశీలనాధోరణి ఇందులో ద్యోతకము అవుతుంది. ఈ పుస్తకం ఆధారంగానే అని అనుకున్నప్పటికిని వీరిని కేంద్ర సాహిత్య అకాడమీ కౌన్సిలు సభ్యులుగా ఎన్నుకొనుటకు కారణభూతము అయినది. శ్రీ కృష్ణదేవరాయల వారి "దేశభాషలలో తెలుగులెస్స" అన్న వాక్యానికి పరమార్థంగా తెలుగు భాషలోని తియ్యదనమును గుర్తించి ఉర్దూలో 'తెలుగు సాహిత్య చరిత్ర'ను ప్రచురించినారు. వీరి సాహిత్యాభిలాష కారణముగా రవీంద్రనాథ టాగూర్ శతవార్షిక జయంతి సంఘంనకు కార్యదర్శిగాను, గురజాడ శతవార్షిక జయంతి సంచిక సంపాదకులుగాను వ్యవహరించి వాటిని దిగ్విజయము చేసి 1974-75లో ప్రపంచ తెలుగు మహాసభకు కోశాధికారిగా, వాటికి ఎంతో ఘనతను చేకూర్చినారు. కేంద్ర సాహిత్య అకాడమీ తెలుగు సలహా సంఘంలో 20 సం॥లు Genral Council తర్వాత 15 సం॥లు Executive Council లలో పనిచేసినారు.

శ్రీ రామానుజరావుగారు బమ్మెరపోతన కేవలం భక్త కవియే కాదు సహజసిద్ధమైన శృంగార కవి అనియు, శృంగార నైషధమును రచించిన శ్రీనాథుడు కూడా పోతనామాత్యుడితో సరితూగ లేడని (సారస్వత నవనీతము పుట 230)లో విమర్శనాత్మకముగా వివరించి చూపినారు. అంతేకాక సూరన అయిదు తరాల శృంగారమును చిత్రించితే, పోతన అరువది తరాల శృంగారమును చిత్రించినాడు అని నిర్మాణాత్మకమైన మనోరంజకమైన విమర్శన గావించి ఉన్నాడు. పోతన భక్తి రసములో నుండి శృంగారంను వెలికి తీసి వారి శృంగార భావనను అందించిన వారిలోని పరిశీలనకు, భావనకు మనం

జోహార్లు అర్పించాలి. భాగవతమును నూత్న దృష్టితో పరికించడానికి అవకాశ మిచ్చినందులకు ఆయనకు ధన్యవాదాలు చెప్పాలి..

ఒక చోట రామానుజరావు గారు 'ఒక జాతి సారస్వతము ఆ జాతి జాతీయ జీవనమునకద్దము వంటిదని' అంటారు. రావుగారు పుట్టి పెరిగిన కుటుంబంలో ఉన్న వసతినీ, అనాటి అవకాశాలనూ, చదివిన చదువునూ, ఈనాడు వారు ఆంధ్ర సారస్వత పరిషత్తు ఆవరణలో ఓ చిన్న గదిలో కూర్చునే తీరునూ తలచుకుంటే కొంత ఆశ్చర్యము కలుగకమానదు. వీరు పుట్టింది భూస్వామ్య వర్గానికి చెందిన కుటుంబం కాబట్టి భూ వసతి బాగా ఉన్నది ఆ వసతి చూసుకొని అక్కడే స్థిరపడితే ఈనాటికి సిరిసంపదలతో తులతూగే భూస్వామిగా కనిపించేవారు. వాటికి ఆయన లోభపడ లేదు. 1939 నాటికే పట్టభద్రుడు అయిన వీరు అనాటి అవకాశాలు సరి చూసుకొని నిజాం ప్రభుత్వంలో ఉద్యోగిగా చేరినా పించన్ పుచ్చుకొనే నాటికి తప్పకుండా అత్యున్నత కార్యదర్శి హోదాలో ఉండేవారు. ఉన్నతోద్యోగ భవిష్యత్తును కూడా వారు ఆశించలేదు. వకీలు వృత్తిలో స్థిరపడినా నేటి సుసంపన్న న్యాయవాదుల్లో ఒకరుగా కనిపించేవారు. చదివింది న్యాయ శాస్త్రం అయినా మీరు సాహిత్య విమర్శకు మంచి మెరుగులు దిద్దారే? ఏ ప్రభావం వల్ల? అని ఎవరైనను అడిగితే ఆయన నుండి వచ్చే సమాధానం ఇది. సాహిత్యం, ముఖ్యంగా నవ్య సాహిత్యం అంటే నాకు మొదటి నుంచీ ఇష్టమే. పూర్వ పద్ధతిలో వ్యాకరణం, అలంకార శాస్త్రం వంటివి నేను చదువలేదు, వాటి సంగతి నాకు తెలియదు. కాని చిన్నప్పుడు "ఆంధ్ర ప్రచారిణి" నవలలు బాగా చదివాను. అవి చదవడం వల్లనే నాకు తెలుగు సాహిత్య పఠనాభిరుచి, క్రమంగా రచనాభిరుచి కూడా పెరిగింది. అంతే, ఇదంతా నాయంతకు నేనే తీరిక సమయాల్లో నేర్చిన తెలుగేనని నిర్మొహమాటంగా, నిస్సంకోచంగా చెప్పుతారు.

అంతేకాదు "ఆ రోజుల్లో ఆంధ్ర – తెలంగాణాల మధ్య సేతువు నిర్మించిన నాటక ప్రదర్శనలు, అవధానాలు, గ్రంథాలయాలు, నవలలు, పత్రికలు మొదలైనవి. నా మట్టుకు నేను చిన్నతనంలోనే తెలుగు సాహిత్యము వైపు ఆకర్షితుడనుకావడానికి ఇవే కారణం. సురభివారి కంపెనీవారి నాటకాలను చూచి, అందులో కపిలవాయి రామనాథశాస్త్రి, ఉప్పులూరి సంజీవరావు, వేమూరి

గగ్గయ్య మొదలైనవారు ఆడిన నాటకాలను చూచి, అవధాన సభల్లో పద్యాలు విని, గ్రంథాలయ వార్షికోత్సవాలలో సాహిత్యోపన్యాసాలు విని ధర్మవరం, చిలకమర్తి, పానుగంటి ప్రభృతుల నాటకాలు కొన్ని చదివి విజ్ఞాన చంద్రికా మండలి, ఆంధ్ర ప్రచారిణి గ్రంథమాలలు నవలలు కొన్ని పఠించి, ఆంధ్ర కృష్ణా పత్రికలను అప్పుడప్పుడు చదువుతూ, నీలగిరి, తెనుగు, గోలకొండ పత్రికలను చదువుతూ తెలుగు సాహిత్యంవైపు అభిముఖుడైనాను. చిన్న వయస్సులో సాహిత్యంతో కలిగిన ఆ సంబంధం నాటికీ, నేటికీ తెగిపోక దృఢంగా ఉన్నది'' అని యాభై సంవత్సరాల జ్ఞాపకాలు (1929 నుండి 1979)లో రామానుజరావు గారొక చోట చెప్పినారు.

శ్రీ రామానుజారావు గారు "మా ఊరు ఓరుగల్లు" అనువ్యాసములో వరంగల్లు నగరమును ఇలా వర్ణిస్తాడు.

"కాబోలు నియ్యది కాకతీయులొకప్డు
కరకు నెత్తుట కత్తి కడుగు చోటు
కాబోలు నీద్వార కళ్యాణ వేదిక
అలికి ముగ్గులు పెట్టె తెలుగు పడుచు
కాబోలు వీజీర్ణకమనీయ సౌధాన
సుకుమార శిల్పముల్ సొంపులొలికె
కాబోలు నీవీధికాపురంబొనరించె
పైడి మేడలలోన భాగ్యలక్ష్మి
ఇచటనే నిల్చి కాబోలు నిందుముఖులు
అయుధంబులు పూజించియరుగుదెంచు
ఆంధ్ర సేనకు కపురంపుటారతులను
ఇచ్చి వారల శౌర్యంబు మెచ్చినారు,

(వచ్చుతోరణం పుట-17)

ఈ పద్యం చదివినపుడు శిథిలావస్థలోనున్న వరంగల్లు పురా చరిత్రను మన ముందు ప్రతిబింబింప చేసినారు. "కదనరంగమె కాక మా ఊరు కళాక్షేత్రము కూడా. సంగీతం, సాహిత్యం, చిత్రలేఖనం, శిల్పం మొదలైన కళలు మా ఊరిలో కాకతీయ ప్రభువుల ఆధ్వర్యాన వేయి ముఖాలుగా విస్తరించినవి. కాకతీయ ప్రభువుల పోషణలో ప్రోత్సాహముతో తెలుగు భాష,

తెలుగు సాహిత్యము, తెలుగు కళలు అద్వితీయముగా అభివృద్ధి చెందినవి. నాడు తెలుగు భాష దాదాపుగా అధికార భాషగా అమలులోనికి వచ్చినది. కాకతీయ ప్రభువులు తెలుగులో శాసనాలను వ్రాయించినారు. వరంగల్లు కోటలో కట్టడాలు, వేయి స్తంభాల దేవాలయము, పద్మాక్షి దేవాలయము మొదలైన ఆలయాలు యీ రోజు శిథిలమైనప్పటికిని నాడు శిల్పము, సంగీతము, చిత్రలేఖనము నృత్యము వంటి కళలు సాధించిన అత్యున్నత స్థాయికి సాక్షీభూతంగా సజీవ నిదర్శనాలుగా నిలిచి ఉన్నవి అని (నా రేడియో ప్రసంగాలు పుట-81) 'మా ఊరు ఓరుగల్లు' వ్యాసంలో అంటారు. మాతృభూమిని, మాతృ భాషని మరచినవాడు, మరణించినవాడితో సమానము. రామానుజరావుగారికి తాను పుట్టిన గడ్డపై ఎంత మమకారమో "గడిచిపోయిన ఆనాటి చరిత్రనే కాదు, జరుగుతున్న ఈనాటి చరిత్రలోను, రేపు జరుగనున్న చరిత్రలోను మా ఊరు వరంగల్ గణనీయమైనది" (నా రేడియో ప్రసంగాలు పుట - 86) అని సగర్వంగా చాటుచున్నారు. సాహిత్య సంపదలో తెలంగాణా వెనుకబడిన ప్రాంతమనే కొందరి అభిప్రాయాన్ని రామానుజరావుగారు "తెలంగాణాలోని గ్రామాలలో తాళపత్ర గ్రంథాలు లేని వూరు లేనేలేదని చెప్పితే అతిశయోక్తి కాజాలదు" అని సహేతుకంగా వివరించారు, (సాహిత్యోపన్యాసాలు పుట - 7)

శ్రీ రామానుజరావుగారు కేవలం సాహిత్య వికాసమునకు మాత్రమే తన సేవలను పణం పెట్టకుండా సాంస్కృతిక పునరుజ్జీవనంకు కూడా ఆయన ఎంతగానో సేవ చేసారు. శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయం నిలద్రొక్కుకొనుటలోను, ఆంధ్ర సారస్వత పరిషత్తు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ భవనాలు, వాటి ఉనికి స్థిరంగా ఉండటంలోను ఆయన ప్రతిక్షణం అవిరళకృషిని మనం ఒకసారి వెనుతిరిగి చూడాల్సి ఉంటుంది. అంతేకాదు ఆయనలోని అంకితత సాధనా పటిమకు అవి మూల స్థంభాలుగా నిలుస్తాయి. అంతేకాదు ఉస్మానియా విశ్వవిద్యాలయంను హిందీ విశ్వవిద్యాలయంగా మార్చివేయడానికి జరిగిన ప్రయత్నాలను వమ్ము చేయడంలోను, అందులోనూ తెలుగు భాషను నిర్బంధ భాషగా ప్రవేశపెట్టడంలో ఆయన సాధించిన ఫలితం, అందుకు ఆయన సమిష్టిగా సాధించిన ఫలితం ఈనాడు మనమందరం అనుభవిస్తున్నది అయినప్పటికిని, ఎంతమందికి అది తెలుసు. అప్పటి విద్యాశాఖ మంత్రి శ్రీ బూర్గుల రామకృష్ణారావుగారు పరిషత్తు కృషిని గూర్చి ఇలా ప్రశంసించారు "సూర్యుని వెలుతురు వలె పరిషత్తు ఉద్యమము పల్లెపల్లెలకు వ్యాపించి అజ్ఞాన

తమస్సును నివారించుచున్నదని" దేవులపల్లి రామానుజరావు గారికి, మాడపాటి హనుమంతరావు, సురవరం ప్రతాప రెడ్డి, కొమర్రాజు లక్ష్మణరావుగారల సహకారం దొరకడం, విష్ణుకు గాలి తోడైనట్టుగా ఆంధ్రోద్యమం తెలంగాణాలో మొత్తం వ్యాపించి తెలుగు సాహిత్య వీధులలో వీరవిహారం చేస్తూ, పునరుజ్జీవనమునకు అది నాందిపలికింది. దీనికి తోడుగా ఆంధ్ర సారస్వత పరిషత్తు కృషిని కేంద్ర సాహిత్య అకాడమీ వారు గుర్తించి ప్రోత్సహించడం దానికి మరింత వన్నె తెచ్చింది. రామానుజరావుగారు ఒకచోట అంటారు నైజాం ప్రభుత్వం కాలంలో సభలు పెట్టుకోవడం ఇబ్బందికావడం, డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్ గారిని రాష్ట్ర ప్రభుత్వం అనుమతి లేకుండానే ఆహ్వానించడం ఆయన అంగీకరించి ఆలంపురం సభలకు వచ్చి కొంతసేపు ఆంగ్లంలోను, తెలుగులోను మాట్లాడి మా అందరిని ఆశీర్వదించి, మా ఆంధ్ర సారస్వత పరిషత్తు సప్తమ వార్షికోత్సవము జయప్రదం చేసినారని అన్నారు ఈ సంఘటన 1953లో జరిగినది. (యాభై సంవత్సరాల జ్ఞాపకాలు- పుట 29)

శ్రీ రామానుజరావుగారికి కలిగిన అదృష్టాలలో మరొకటి వీరు భారతకోకిల శ్రీమతి సరోజినీనాయుడు గారితో హైద్రాబాద్‌లో ప్రత్యక్షంగా, సన్నిహితంగా గడపడానికి అవకాశం కలిగింది. ఆమె చేసిన ఎన్నో ప్రసంగాలను ఆయన చెవుల్లో గింగుర్లు తిరుగుతున్నాయి అని అంటారు. ఆమె చెప్పిన ఒక ఉర్దూ ఖండికను వారు ఉదహరించారు.

"బుల్ బుల్‌కు గుల్ ముబారక్
గుల్ కూ చమన్ ముబారక్
రంగీన్ తబీయతోంకు
రంగీన్ సుఖున్ ముబారక్"

ఈ ఖండికను ఆమె హైదరాబాద్‌లో హోలీ పండుగ సందర్భంగా చెప్పినారట. ఆ గతస్మృతులను తలచుకుంటూ, మహానాయకులను గుర్తుచేస్తూ తన జ్ఞాపకాలలో ఒక చోట ఇలా అంటారు. "నిజానికది మహోన్నతమైన మహోదాత్తమైన వ్యక్తిత్వము సంస్కృతి గల నాయకుల యుగం. వారందరూ రాజకీయరంగంలోను, విజ్ఞాన రంగంలోను అతిరథమహారథులైన సవ్యసాచులు త్యాగమూర్తులు, భారతదేశ వైతాళికులు, యువకులుగా, విద్యార్థులు వారి నుండి ఉత్తేజం పొందేవారు".

"ఆంధ్ర సారస్వత పరిషత్తుతో వివిధ సమస్యలపై భిన్నాభిప్రాయాలు కలవారు. రాజకీయంగా, సాంఘికంగా ప్రత్యేక దృక్పథం కలిగిన వారు అందరు సహకరించినారు. కావుననే సారస్వత పరిషత్తు ప్రజల సంస్థ, తెలుగు భాషా సంస్కృతుల పరిరక్షణ కొరకు అంకితమైన సాంస్కృతిక సంస్థ. నాటి నుండి ఈ పరిషత్తు నిరంతరాయంగా అభివృద్ధి పథంలో ముందడుగు వేస్తూ భాషారంగంలో చరిత్రాత్మకమైన కృషి చేసినది' అని అంటారు.

ఈ నాడు విద్యాభ్యాసములో ఉర్దు మాధ్యమికత కేవలం ముస్లిము సోదరులకే పరిమితము అయిపోయినది కాని, తెలంగాణాలో 1950కు ముందు నిజాం రాష్ట్ర పాలనలో ఉర్దు మాధ్యమికంగాను, ప్రథమ భాషగాను దానికి ప్రాధాన్యత ఉండేది, దానితో పాటుగా పారసీ భాష కూడా ప్రముఖంగా ఉండేది. ఈ ప్రాచుర్యమును గమనించే ఆయన తెలుగు సాహిత్య చరిత్రను ఉర్దులో రచించినారు. అంతే కాకుండా ఆనాటి తెలుగు భాషపై పారసీ. ఉర్దు భాషల ప్రభావము గాఢంగా ఉందని చెప్పుతూ, శ్రీనాథుని కాలంలో కూడా శ్రీనాథుడు, జక్కన, గోగులపాటి కూర్మనాథ కవుల కవిత్వంలో కూడా ఈ పదాలు చోటు చేసుకున్నాయని చెప్పుతూ కొన్ని పద్యాలను పేర్కొన్నాడు కూడా. శ్రీనాథుడు వాడిన ఒక పద్యం.(నా సాహిత్యోపన్యాసాలు- పుట-36)

"పూజారి వారి కోడలు
తాజాగ బిందె జారి దబ్బున బడియెన్
మైజారు కొంగుదడిసిన
బాజారే తిరిగి చూచి ఫక్కున నవ్వెన్",

ఇక్కడ 'బాజారు' అనే పదం గమనించాల్సి ఉంటుంది. ఇక్కడ ఈ విషయం ప్రస్తావించడం ఎందుకంటే ఆయనలోని నిరంతర పఠనం, విమర్శక ధోరణి, సునిశిత పరిశీలనను మీ ముందుంచడమునకే ఇక్కడ చెప్పడం జరిగింది.

శ్రీ రామానుజరావు గారి ప్రోత్సాహ ప్రచారములను పొంది మహాకవులుగా, గ్రంథకర్తలుగా, కళాప్రపూర్ణులుగా, ఆస్థాన కవులుగా, ఉత్తమోత్తమ బహుమతి గ్రహీతలుగా వెలసిన యువ కవులు, రచయితలు ఎందరో ఉన్నారు. దేశ సౌభాగ్యమే తన సౌభాగ్యమని భావించి అడిగిన ప్రతివ్యక్తికి

సహాయము చేసిన ఉదారహృదయుడాయన. ప్రతి కవి వ్రాసిన కావ్యమునకు ఆవిష్కరణోత్సవ సౌకర్యం కలిగించుటకు పరిషత్ ప్రణాళికలో చేర్చిన అయన సౌహార్ద్రము మెచ్చదగినట్టిది. ఆయన స్వయముగా కవి, విమర్శకుడు, కృతి భర్త. ఆయనకెందరో కవులు, రచయితలు తమ కావ్యములను అంకితం చేసి ధన్యులైనారు. (శ్రీలేఖ సాహితి కూడా తన వంతు కర్తవ్యంగా శుక్ల కవితా సంకలనం చంద్రునికో నూలు పోగులా 1989 ఉగాదినాడు అంకితం ఇచ్చింది) అంతేకాదు పరిపాలనా దక్షుడైన ఆయన సన్నిధిలో అలసత్వమునకు, నిర్లక్ష్యమునకు, ఏమరుపాటుకు, వ్యక్తి విమర్శకు తావులేదు. బి.ఎ., ఎల్.ఎల్.బి. పట్టము వహించి, రాజకీయవేత్తయైన ఇట్టి మనీషి దొరకుట చేతనే ఆంధ్ర సారస్వత మందారము వికసించి పరిమళించినది. జీవితమును సారస్వత సేవకే ధారబోసిన శ్రీ రామానుజరావుగారు ఎంతో ధన్యులు. అంతేకాదు ఈయన కర్మయోగి.

"దిన పూర్వ పరభాగజనితమైన ఛాయ పోలిక నుండు
కుజన సజ్జనుల మైత్రి"-అన్నట్లుగా జాతి మత కుల విభేదాల

నెరుగని ఈ తెలంగాణా తెనుగు బిడ్డ మైత్రి అట్టిది. ఈయన హృదయం స్నేహ దుగ్ధ పూర్ణము. తెలంగాణాలో శ్రీ రామానుజరావుగారు పాల్గొనిదీపింప చేయని ఉద్యమము లేదు, పాలించి పెంచని సంస్థలేదు. విశాలాంధ్ర ఏర్పడిన తర్వాత సమగ్ర ఆంధ్ర జీవిత చీనాంబరానికి ఓతప్రోతమై ఉభయ ప్రాంతాల మధ్య స్నేహసేతువైనారు. ఈయన కీర్తి, యీయన మూర్తిని మించినది అని డా॥ మరుపూరు కోదండ రామరెడ్డిగారు ప్రశంసించారు.

తన జాతి సంస్కృతీ సంపదను తన వారికి ప్రదర్శించి, వారిలో ఆత్మ గౌరవాన్ని కలిగించి, ఉత్తేజాన్ని కలిగించటమే రామానుజరావుగారు తమ సాహిత్య కృషికి లక్ష్యంగా పెట్టుకున్నాడు.

శ్రీరామానుజరావుగారు వెలువరించిన గ్రంథాలు ఇవి.

1) పచ్చతోరణం (ఖండకావ్యము)
2) సారస్వత నవనీతము
3) తెలుగు సీమలో సాంస్కృతిక పునరుజ్జీవనము
4) తెలంగాణాలో జాతీయోద్యమాలు

5) నా రేడియో ప్రసంగాలు
6) ఉపన్యాస తోరణము
7) నా సాహిత్యోపన్యాసాలు
8) వేగుజుక్కలు
9) తెనుగు సాహితి
10) యాభై సంవత్సరాల జ్ఞాపకాలు (1929 నుండి 1979 వరకు)
11) తలపుల దుమారము
12) పంచవర్ష పత్రికాళికలు
13) బంకించంద్ర ఛటర్జీ జీవితము
14) హైద్రాబాదులో స్వాతంత్ర్యోద్యమం
15) ఆక్స్‌ఫర్డ్ డిక్షనరీ (బాలుర కొరకు—సచిత్రంగా)
16) మనదేశం — తెలుగు సీమ (బాలల కొరకు ఉద్దేశించినవి)
17) జవహర్‌లాల్ నెహ్రూ "
18) గౌతమ బుద్ధుడు "
19) కావ్యమాల—II — సంపాదకుడు కేంద్ర సాహిత్య అకాడమీ ప్రచురణ (ఇది కేవలం స్వాతంత్ర్యానంతరం వచ్చిన కవితల సంకలనం)

సంపాదకత్వం వహించినవి :—

1) శోభ సాహిత్య మాస పత్రిక (1945-46 & 50-52)
2) గోల్కొండ దినపత్రిక సహాయ సంపాదకుడు (48-64)
3) గురజాడ శతవార్షికోత్సవ సంచిక (తెలుగు—అంగ్లం) (1962-64)
4) రవీంద్రనాథ ఠాగూరు శత వార్షికోత్సవ సంచిక (1960-61)
5) రెండవ ప్రపంచ తెలుగు మహా సభల ప్రత్యేక సంచిక (1981)

శ్రీరామానుజరావుగారు అంకితము తీసుకున్న గ్రంథాలు దాదాపుగా 30 కృతులు. వీటిలో డా॥ దాశరథి, మునిమాణిక్యం, నరసింహారావు, గుంటూరు శేషేంద్రశర్మ, డా॥ సి. నారాయణ రెడ్డి, శివశంకరస్వామి, తూమాటి దోణప్ప, డా॥ పల్లా దుర్గయ్య. డా॥ బోయి భీమన్న, తదితర శ్రీలేఖ సాహితి ప్రచురించిన 'శుక్ల' కవితా సంకలనం దీనికి సంపాదకుడు టి. శ్రీరంగస్వామి పుస్తకాలు కూడా చోటుచేసుకున్నాయి.

శ్రీ రామానుజరావుగారు ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ ఆంధ్ర సారస్వత పరిషత్తు ద్వారా ఎంతో మంది రచయితలతో ప్రత్యక్ష పరిచయం, సన్నిహితత్వం ఉన్నందు వలన వారి మనస్తత్త్వములను పరిశీలించినాడు కాబట్టే ఆయన "నల్లగొండ జిల్లా రచయితల ప్రారంభోపన్యాసములో" ఇలా అంటాడు. 'రచయితకు సలహా ఇవ్వడం, ఉపదేశం ఇవ్వడం నా ఉద్దేశం కాదు, ఒక అభిప్రాయాన్ని రుద్దటం కూడా నా అభిమతం కాదు. అయినా రచయితలను గురించి చాలామందిలో వినవస్తున్న అభిప్రాయాలను మీముందుంచడం అసమంజసమూ, అప్రస్తుతము కాదనుకుంటాను. సమకాలీన వ్యక్తుల ఆలోచనలలో, చిత్తవృత్తులలో వస్తున్న మార్పు వేగాన్ని అందుకొనడానికి రచయితలకు సాధ్యం కావడంలేదు. అతనికి పరిశీలనా శక్తి లేదు. దానికి కావలసిన ఓపిక, ఓర్పూ అతనికి లేదు. సామాజిక స్పృహతో సరియైన సంబంధంలేదు. వారి రచనలకూ, వారు నివసిస్తున్న జీవితానికి మధ్య పెద్ద అఖాతం ఉన్నది. రచయిత తాను సామాన్య జనానికి అతీతుణ్ణని భావిస్తున్నట్లు తనకు సమాజంలో ప్రత్యేకమైన స్థానం ఇవ్వాలని ఆశిస్తున్నట్లు కనిపిస్తుంది, రచయిత ఉపదేష్ట మాత్రమే కాదు ఆదర్శమూర్తి కావలె- చేతలకూ, మాటలకూ గల అఖాతాన్ని ఎంతగా తగ్గించే ప్రయత్నం చేస్తే అంతగా రచయిత జనానికి సన్నిహితం అయ్యే అవకాశం ఉంది. రచయిత తాను కట్టుకున్న గూడు నుంచి బయటపడాలె. తాను గీసుకొన్న పరిధిని దాటి వచ్చి జనం జీవనాడిని పట్టగలగాలె. రచయిత పరస్పర మాత్సర్యాన్ని వదిలి పెట్టాలె. అప్పుడే జనము అతన్ని గుర్తిస్తారు''. అంతేకాదు ''రచయితలు చాలా మంది స్వేచ్ఛను గురించి మాట్లాడుతుంటారు. ఈ రోజు చాలా మంది రచయితలు తమంతతామే బానిసలు. అవకాశాలకు బానిసలు. కొందరు రాచరికపు వ్యవస్థలోని వందిమాగధులకు ఏమాత్రం తీసిపోరనే అభిప్రాయం కూడా ఉన్నది. సమాజం బాధ్యతను స్వయం సేవకుడిగా స్వీకరించవలసిన రచయిత తన అవకాశాలకు తన వ్యక్తిత్వాన్నే పణం పెట్టినప్పుడు తనకే కాదు, తన భాగస్వామి అయిన సమాజానికే అన్యాయం చేసుకున్న వాడౌతాడు, రచయిత స్వేచ్ఛకు తానే శత్రువు కాగలడు'' అని నిస్సంకోచంగా ఆయన తమ అభిప్రాయాలను వెలిబుచ్చారు.

శ్రీ రామానుజరావుగారు సారస్వత నవనీతము (పుట-62)లో రచయితల గురించి ఒక చోట ఇలా అంటారు ''అధర్మములకు, అన్యాయములకు సుకుమార హృదయాలు సాధారణ మనుజులకన్నా నెక్కుడు క్షోభింతురు.

ఆయా వేదన, ఆయుద్వేగము మహాగ్రంథ రచనగా ప్రత్యక్షమగును. విశ్వ సాహిత్యము ఒకమారు వీక్షించితిమేని గ్రంథ రచయితలెల్లరు క్షోభించి, కుమిలి కృషించినవారే, సమకాలిక సంఘమునందలి యక్రమములనెదుర్కొన్న వారే, తత్ఫలితముగా ననేక కష్టములననుభవించిన వారేనని".

పత్రికలకు నిర్వహణ చేసే వారిగురించి, దానిని నిర్మొహమాటంగా ఏ విధంగా ఉండాలో వారు చెప్పినారు ఈ క్రింది మాటలలో ప్రస్తావించారు "దేశాన్ని, ప్రజల జీవితాన్ని సినిమా చూసినట్లు చూడవలెనంటె అందుకు సాధనమెక్కటే అదే మన పత్రికలు. ఆశయ శుద్ధితో నిర్భయముగా స్వతంత్రముగా పత్రికలను నిర్వహించవలెను. దేశానికి స్వరాజ్యము రాకముందు పత్రికలు ఎంత నిర్భయంగా నిర్వహించినారో, ఈనాడు కూడా అంత నిర్భయముగా నిర్వహించవలెను. ఈ విషయములో నాకు ఆశాభంగం కలిగింది'' అని ఉపన్యాస తోరణములోని(100వ పుట) ''ఆంధ్రప్రదేశ్‌లో స్వాతంత్ర్యోద్యమం" వ్యాసం వందు.

శ్రీ రామానుజరావుగారు ఒక చోట నిస్సంకోచంగా తను ఇలా చెప్పుకున్నారు "జీవితములో నాకు కల్గిన అదృష్టాలలో మిత్రుల సహకారం ఒకటి'' అంటారు. ఆనాటి నుంచి యీనాటి వరకు కాలానుగుణంగా సాహితీ సేవ చేస్తున్న రామానుజరావు గారు అందరికీ ఆప్తమిత్రులు–అజాత శత్రువులు ఆయన ఒకచోట ఇలా అని వాటిని సాదృశ్యంగా సాధించిన మహోన్నతుడు కూడా "నా రచనల్లో చూపిన ఆదర్శాలను, నా చేతనయినంతవరకు నా జీవితములో అనుష్టించిన వాటినే నా రచనల్లో వ్రాసినాను"

శ్రీ రామానుజరావుగారు సంఘ సంస్కరణాభిలాషి, నిష్కళంక జాతీయవాది. సంస్కృత ఆంధ్రములతో పాటు ఇంగ్లీషు, పారసీ, ఉర్దూ భాషలలో ప్రావీణ్యం కలిగిన పండితులు. అనేక విషయాలను గూర్చి సంపూర్ణమైన విజ్ఞానము సంపాదించిన మేధావి. మంచి వక్త, విమర్శకుడు. పరిశోధకుడు. ఎంతటి ఉద్గ్రంథమైననూ వేగంగా చదువగలిగి అందులోని సారాంశాన్ని గ్రహించగలిగిన మేటి పాఠకుడు. నిరంతర గ్రంథావలోకనంలో నిమగ్నుడైయుండే సంస్కృతీపరుడు. అన్నిటికన్నమిన్నగా దవ్వునకుభయతరుడుగా కనిపించినప్పటికీ, దావునకు వచ్చిన తరువాత వరమాప్తుడు కాగలిగిన అమృత మూర్తి. ఇన్ని సుగుణాలు కలిగిన శ్రీ రామానుజరావుగారు సాధించిన

కృషి ఏమిటి? అందువలన జరిగిన భాషా వికాసం ఏమిటి? రచయితగా ఆయన ప్రతిభావ్యుత్పత్తులు ఏమిటి? తెలుగు సారస్వతంలో ఆయన విశిష్టత ఏమిటి? అను ప్రశ్నలు సహజంగా ఉత్పన్నం అవుతున్నవి. ఈ ప్రశ్నలకు మనం ఇచ్చే సమాధానాలు తెలుగు సైతాళికుడుగా ఆయన స్థానాన్ని నిరూపించగలవు. "ఆంధ్ర వాఙ్మయానికి ఆయన అనుపమానమైన భక్తితో సేవలందించి, అందిస్తున్న భాషా భక్తుడు.

ఆంధ్ర ప్రదేశ్ ఓపెన్ యూనివర్సిటీ 1990 మే 19వ తేదీనాడు వీరికి డాక్టరేట్ పట్టాను ఇచ్చినది.



**Literary Activities :**

1. a) Secretary, Andhra Pradesh Sahitya Akademi
1957 to 1979

   b) Vice-President, Andhra Pradesh Sahitya Akademi
1979-1982

   c) President, Andhra Pradesh Sahitya Akademi
1982-1985

2. a) MEMBER, Executive Commitee, Andhra Saraswatha Parishath, | 1944-47

   b) Vice-President, Andhra Saraswatha Parishath
1947-52 & 1954-1980

   c) President Andhra Saraswatha Parishath
1952-54 & 1983-Onwards

3. Secretary, Telugu Library, Warangal 1943-47

4. Member, Executive Committee, Central Sahitya Akademi, New Delhi 1967-1977

5. Secretary, Tagore Centenary Celebrations Committee, Govt. of Andhra Pradesh 1960-62

6. Membar, Excutive Board, Moulana Azad Memorial Reserch Institute, Hyderabad.

7. Member. Executive Board, Anjuman Taraqqui-e-Urdu, Hyderabad.

8. Member, Bharatiya Bhasha Samithi, Govt. of India, New Delhi. 1970-72

9. Member, Executive Bord and General Council, Telugu Bhasha Samithi, Hyderabad.

10. Chirman, Hyderabad City Grandhalaya Samstha Hyderabad. 1966-73

11. Treasurer, First World Telugu Conference. 1975-76

12. Member, Executive and Board of Governors, Telugu Akademi 1967 onwards

13. Member, Executive and Board of Governors, International Telugu Institute, 1975 onwards

14. Member, Executive and General Council Urdu Akademi 1976-79

15. Secretary, Andhra Saraswatha Parishath Trust, Hyderabad 1972 onwards

16. Vice-President, Surabharathi Samithi, Hyderabad. 1970 onwards

17. Secretary, All India Library Conference, 1954

18. Member, Programmes Advisory Committee, All India Radio, Hyderabad. 1962-68

**Education ;**

Served on the followiog Ccmmittees cf the - A.P. Government.

1. Central Advisory Beard cf Education, 1952-55
2. Text Book Ccmmitee. 1952-57
3. Selection Committee of Tsachers of Education Department 1952-57
4. Book Committee of the Stats Central Library, 1965-75
5. Adult Education Committee, 1952-54

6. Hindi and Sanskrit Committee, 1952-57

7. College Educational Committee, 1952-54

8. Chirman, Telugu Typewriter key Board Committee of the Government of Andhra Pradesh, 1957

9. Secretary, Citizens Committee to oppose Transfer of Osmania University to Centre. 1952-54

10. Member, Riyayat Scholarship Committee, 1954-56

11. Vice-president, Madresa-e-Aizza High School, Hyderabad. 1964-80

12. Member' Executive Board, Asaifa High School, Hyderabad.

13. Member, Administrative Glossary Committee, A.P. Legislature. 1957-60

**University**

1. Member. Senate, Osmania University, 1953-75

2. Member, Syndicate, Osmania University, 1963-76

3. Acting Vice Chancellar. Osmania University, Oct. 1972

4. Acting Vice Chancellor, Osmania University August to October 1973

5. Acting Vice Chancellor, Osmania University, January & May, 1975

6. Member, Executive Council Hyderabad University,

7. Member, Executive Council, A.P. Open University, Hyderabad.

## Journalisam

1. Edited "SOBHA" a high class literary magazine for 2 years 1945-48

2. Worked on the Editorial staff of 'GOLKONDA PATRIKA' a Telugu Daily from Hyderbad 1948-64

3. Edited Gurajada Centenary Souvenir in Telugu and English 1962-64

4. Edited Tagore Centenary Souvenir in English 1960-61

5. Edited Prapancha Rajya Sarvaswamu 1977

6. Edited Special Souvenir Second world Telugu Conference at Koulalampur. 1981

## Poltical Activities

1. Closely connected with the National Movement of Hyderabad State,

2. Member, Andhra Pradesh Congress Committee. 1960-64

3. President of the Youth Congress, Warangal 1945-46

4. Member of the Election Tribunal, Hyderabad-State Congress 1949-50

## Co-operation

1. Director, Hyderabad General Co-operative Trading Society, Hyderabad 1954-58

2. Director, Hyderabad Co-operative General Insurance Society, Hyderabad. 1959-71

**Andhra Movement**

1. Presidet, Visalandhra Maha Sabha
   Hyderabad City
2. Member, Editorial Committee appointed by the Government of Andhra Pradesh to compile the History of Andhra Movement
3. Member, Executive Board and Editorial Committee of the History of Freedom Struggle. Government of A.P.

**Parliment**

1: Member. Rajya Sabha 1960-62

**Other Activities**

1. Member. Editorial Committee, District Gazetteers.
2. Vice-President, Andhra bharathi
3. Member. Managing Committee of Ravindra Bharathi 1962 to 1980
4. Member, Administrative Glossary Committee, Government of Andhra Pradesh. 1957-60
5. Member, Development of Modern Indian Languages Committee, Government of Andhra Pradesh 1960-67

## శ్రీ రామానుజరావుగారికి కృతి యిచ్చిన రచనలు

1. అశ్వఘోషుడు (నాటకము) – డాక్టర్ అరిపిరాల విశ్వం
2. నవోదయం – కీ శే. బెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రి
3. అనపోతు – కీ. శే. సిద్ధయ్యకవి

4. కవితాపుష్పకం – డా. దాశరథి

5. తెలుగు హాస్యము – స్వర్గీయ మునిమాణిక్యం నరసింహారావు

6. సాహిత్యకౌముది – శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ

7. జయంతి – శ్రీ ముదిగొండ వీరభద్రమూర్తి

8. సాహిత్య సౌరభం – డా. జి.వి. సుబ్రహ్మణ్యం.

9. జాతక కథలు (ఐదవభాగం) – స్వర్గీయ స్వామి శివశంకరస్వామి

10. ఉదయం నా హృదయం – డా. సి. నారాయణ రెడ్డి

11. భాషాచారిత్రక వ్యాసావళి – డా. తూమాటి దోణప్ప

12. మందారాలు – శ్రీ పోతుకూచి సాంబశివరావు

13. వైతరణి – కుమారి వాసిరెడ్డి సీతాదేవి

14. అక్షరగుచ్ఛము – డా. జ్ఞానానంద కవి

15. ప్రతిజ్ఞ – శ్రీ ఎన్.వి. జగన్నాధం (మాజీ శాసన సభ్యులు)

16. పారసీ కవుల ప్రసక్తి – శ్రీ ఎస్. సదాశివ

17. అల్లసాని పెద్దన – డా. పల్లా దుర్గయ్య

18 శ్రీనాథుని సాహిత్య ప్రస్థానము – శ్రీ జంధ్యాల జయకృష్ణ ప్రసాద్ బాపూజీ

19. నెలవంక – ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రాచ్య కళాశాల పక్షాన వెలువడిన ప్రత్యేక సంచిక

20. కాంతిపుంజాలు – శ్రీ నీలా జంగయ్య

21. బొమ్మ – శ్రీమతి జ్యోతిర్మయి

22. కావ్యమీమాంస–సంస్కృత అలంకారశాస్త్రానికి తెలుగు అనువాదం (రాజశేఖరుడు) – డా. పుల్లెల శ్రీరామచంద్రుడు

23. లజ్జా కిరీటధారణి – శ్రీమతి పూటుకూరి లక్ష్మీకాంతమ్మ

24. పుంభావ సరస్వతీ శ్రీనాథుడు – శ్రీ పాలకోట రాధాకిష్ణమూర్తి

25. ఉగాదులు – డా. బోయిభీమన్న

26. వ్యాసాంజలి – శ్రీ తక్కెళ్ళ బాలరాజు

27. బెజవాడ దుర్గామల్లీశ్వరాలయశాసనాలు–డా. బి.ఎన్. శాస్త్రి, ఎడిటర్

28. చుక్క – (శ్రీలేఖ సాహితి)–శ్రీ టి. శ్రీరంగస్వామి, సంపాదకత్వం

*T. Sri Ranga Swamy*
H. No. 5-11-114/4, Vidyaranyapuri, Warangal.

**Printed Books ;**

Madhura (Freeverse Poetry) 1984
ShiKharam (Freeverse Poetry) 1986
Manasa Sancharare ... (Freeverse Poetry) 1988
Vipanchi (Essays) 1986
Warangal Zilla Rachayithala Vangmaya Jeevitha Suchik
Kovela Suprasannacharyulu Vangmaya Jeevitha Suchik
A life line Sketch of Devulapalli Ramanuja Rao 199

**Unprinted Books ;**

Warangal Nataka Ranga Charitra
Katragadda Kavitha Samalochanam
Kozara to Ekashila (Telug Poetry - Translation to Yugoslavia
Shataka Sahitya Vikasamu after 1960's

A Publication of
Sahithi Mitramandali, Parkala
Warangal - 506164 A.P.

Rs. 10/-